# విరహిణి



రచన:

యక్షశ్రీ





వెల: 0-12-0

అంకితం

అతి చిన్న వయస్సులో అసువులు బాసిన

నా తోబుట్టువు శ్రీమతి పసుమర్తి

శ్యామసుందర వరలక్ష్మికి.

# తొలి పలుకు

ఆర్యా,

ఈ గేయములు కేవలము భావ ప్రధాన ముగ వ్రాయబడినవి. భావములలో జాలి, కరుణ, నిరాశ, వినతి, మనవి, వ్యథ మొదలగు ప్రకృతి సిద్ధములైన గుణాతిశయములు కలవు. వానిని దృష్టిలోనుంచుకొని కలువ, చంద్రుల మైత్రిని, విరహోత్కంఠితయైన కలువ రాణిని నా గేయసుందరిగా స్వీకరించితిని. అందుకే నా భావము

"ఈ కాలగర్భములోన నేను
కమ్మనైన। కలువరాణిని" ......... అనియు వేరొకచోట

"కలువ చంద్రుల మైత్రికన్న
గాఢమైనది లేదుజగతి" ... అనియు తేటతెల్ల మొనర్చితిని. జీవితంలో ఒంటరితనములోనుండే ఆనందాన్ని, ఆ అవకాశంలో కలిగే అనుభూతి, భావోద్రేకములను నా గేయములద్వారా అందించితిని. అంతియే. ఇది అంతయు నా హృదిలో పొంగారు ప్రేమాగ్ని రాగతప్ప, వేరుకాదు. కలువ, చంద్రునికొరకు పొందే విరహము, చంద్రునికి ప్రకృతి చేసిన మేల్కొలుపు, చంద్రుని-

కలువకాంతమీాద, ఆమె ప్రణయంమీాద ఉండే ఆశ, నిశదీకరించితిని. తరువాత జీవితంలో కలిగే ఆశ, నిరాశలు, ప్రకృతి సౌందర్యము, కలుషిత, అందచందములు మొదలగు భావములను మనస్సున నిడుకొని ఈ గేయములను రచించితిని. నా రచనలో తప్పులున్న ఒప్పులుగా భావించ నా ప్రార్థన. ఇది నా తొలికానుక గనుక.

ఈ గేయరచనలో నాకు మిక్కిలి సహాయము చేసిన శ్రీ చాగంటి గోపాలకృష్ణమూర్తిగారు (తెలుగు ఉపన్యాసకులు, గవర్నమెంటు ఆర్ట్సు కాలేజీ, శ్రీకాకుళం) నా రచనమీాద అడుగగానే చదివి, విని ఆనందించి తమ సదభిప్రాయాలను ఇచ్చిన శ్రీ కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు, శ్రీ నండూరి సుబ్బారావు బి.ఏ. బి.ఎల్ ప్లీడరు, ఏలూరు. ('ఎంకిపాటల' రచయిత) శ్రీ తాండవకృష్ణగార్లకు నా హృదయపూర్వక అభివందనములు.

దీనిని పాఠకులు చదివి ఆనందించి ఇంకను పెక్కు గ్రంథములు రచించుటకు ప్రోత్సాహపూర్వక ఆశీర్వాదము నందించ మనవిచేయుచున్నాను.

విజయవాడ
17-5-56

ఇట్లు
యక్షశ్రీ

# అభిప్రాయాలు

ఈ పాటలు శ్రీ యజ్ఞశ్రీ రచనలు. చాలా మంచి యువకులకు నేడు బహుభావములు వచ్చుచున్నవి. వానికి వ్యక్తీకరణ యెట్లాయని యారాటపడు రోజులు. అది పాటరూపముగా బయలుపడుచున్నది. వీరి భావాలు కూడా ఆ మార్గమునే త్రొక్కినవి. కొన్ని భావాలు రహస్యముగానున్నవి. వ్యక్తీకరణమును పాటలకు సొగసు తెచ్చినది. ఇంగ్లీషులో పట్టభద్రులై లోని భావోదయము ఆపికొనలేక యిట్లు స్వేచ్ఛాగానముచేయు యువకులలో వీరగ్రగణ్యు లనవచ్చును. పంచభూతములు, వెన్నెల, చల్లగాలి, దైవభావము, జీవునియందు రాధాభావారోపణము ఇవియన్నియు మానిసినున్న భావపరంపరను వెలికిత్రోయును. ఇది ఆత్రోవ. ఈ కవి యింకను మంచి గ్రంథములు వ్రాయుగాక యని యాశీర్వచనము.

విజయవాడ,
5—5—'56.

విశ్వనాథ సత్యనారాయణ.

శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్రాయనమః

శ్రీ యజ్ఞశ్రీకి అందరి ఆంధ్రయువకులవలెనే భావోద్రేక మెక్కువ. ఆ ఉద్రేకమును వీరు పాటగా పాడుకొనగలరు. చిత్రముగ చిత్రించగలరు. కవిత్వములో వెలయించగలరు. చిత్రరచనా సామర్థ్యమునకు వీరు చిత్రించిన "విరహిణి"యు (ముఖపత్రముమీద ముద్రించినది) కావ్యఫణితికి ఈ గేయసంపుటియు తార్కాణములు.

హృదయములో నేదో భావముప్పొంగగా పాటల రూపమున పాడుకొన్న పాటలే ఇందులోని గేయములన్నియు. కవి తన భావములను అక్షరరూపమున వెలయించక పూర్వము పాడుకొనునుగదా! కొందరి కా పాట అప్రయత్నముగ ధారగ వెలువడును. అట్టి కోవలోనికి చెందినవా రీ కోమలహృదయులు.

లలితములైన భావములు, హృదయంగమమైన వ్యక్తీకరణము ఈయనకు వెన్నతో బెట్టిన విద్యలు.

పట్టభద్రుడగుటచే నీ కవికుమారుడు ఆంగ్లభాషా సంప్రదాయ వ్యక్తీకరణమునకు కొంత యలవడినాడు.

"నియతమైన భావోద్రేకమె కవిత" యని కొందరి యభిమతము. అట్టి కవిత్వ మింకను వెలయించి సహృదయుల మన్ననల నీ కవికుమారుడు పొంద పరమాత్మను ప్రార్థించుచున్నాను.

కళాపీఠము,
విజయవాడ,
21—5—56

తాండవ కృష్ణ.



ఈ కవికుమారుడు నా కత్యంత మిత్రుడగు లేటు సోమంచి లింగయ్య, బి. ఏ., బి. ఎల్ అడ్వకేటుగారి బావమరిది. నన్ను అభిప్రాయము యివ్వమని కోరగా నేనట్టి మహత్కార్యము చేయగల స్థితిలో లేనని చెప్పి నాను.

ఈ కవి గేయ సంపుటి నాకు గానముచేసి విని పించినారు. ఈ రోజులలో సినిమాల మూలమున గేయ ములకు విలువ పెరిగినది. అందులో ఈ కవిఫణితి అచ్చ ముగా సినిమా ఫణితి. నా కారోగ్యమే ఉండిన వీని నెంతయో గ్రహించి ఆనందించియుందును. కవిగారు యింకా ముందుముందు గొప్పగొప్ప కావ్యములరచించు గాక అని ఆశీర్వదించుట తప్ప వేరే కావ్యవిమర్శనకు పూనుకొనలేకున్నాను.

ఏలూరు,
28—4—'56.

నంఘూరి వెంకటసుబ్బారావు.

# స్తుతి

జయము జయము నటరాజా
జగములనేలే। నటరాజా
నాట్యమాడరావా। ఆటలాడరావా ॥జ॥

మంజీర నినాదం। మనో ఉల్లాసం
మధురతరంగం। మనోహరరూపం ॥జ॥

కళాసమన్విత। కరుణారమణా
కంకణకేయూర। మంజీరచరణా ॥జ॥

ఉజ్వల కిరీట తేజా। నాగసుందర భూషా
నవనవోజ్వల। నయనాంచలరేఖా

నటశిఖామణి। ఓ నటరాజా
నటరాజా। ఓ నటరాజా ॥జ॥

## 1. హెచ్చరిక

రావోయి చందమామా
రాగసుధలన్ తేలింప || రా ||

పండు వెన్నెలలో పరువులెత్తే
పాలసంద్రపు తెలుపు
జవరాలి వలపు || రా ||

నీలి గగనముపై। నిగనిగ మెరిసె
తారకావళి నా లేమ నయనాళి || రా ||

తెల్ల మబ్బులపై। తేలియాడే మామ
చక్రవాకపుతీరు। చెలియగుబ్బల సౌరు || రా ||

చల్లని వెన్నెల్లు। నీ మోము నవ్వుల్లు
ప్రేయసి పల్కుల్లు। తేనియ చిల్కుల్లు || రా ||



# 2. కానుక

రావోయి రేరాజ! రావోయి చంద్రా
జాగు చేసెదవేల! దోబూచులేలా!
కాన్క ఏమనుకున్నావో
కౌముదీ ప్రియుడా
కౌగిలిచ్చెదరారా
కోర్కె లేపార ||రా||

కని విని ఎరుగవా
కరుణార్ద్ర హృదయుడవు
పండు వెన్నెలలోన
పరువులెత్తే వయసు... ||రా||





ఏ నీడ నాకేల ! నా జాడ నీకేల

అనుచు కసరుదువేమొ

అన్యాయ మవునుగ... ॥ రా॥

కామించి నిను నేను

కరుణించమన్నాను

కాన్కా ఏమొ తెలుస

కన్నెప్రాయపు వలపు ॥ ॥ రా॥







# 3. నిరాశ

నా హృదయ వీణలోని
రాగమేమొ ! భావమేమొ
తెలుపలేని ప్రేమయేల
విరిసిన పూతావి యేల ||నా||

తనకు వెనుక చూచుటకు
దరి రాకపోవుటేమొ
మరునిముషమ్మున రాలిపోవు
విరబారిన శేఫాలి... ||నా||

కన్నులుండి నిన్ను నేను
కాంచలేకపోలేదు
కన్నుకన్న మిన్నయంచు
కరుణకొఱకె కాచియుందు... ||నా||



# 4. సందేశము

పరువు పరువున రమ్మి
పరవశ మ్మొ త్తగా
నింగిపై తేలు ! ఓ నీలి జలదమా... ॥ప॥

మనవి చేకొని పొమ్మి
నా అందాల కోమలికి
మరపు రాబోదని
మనవి చేయుము నీవు... ॥ప॥

సౌందర్య దేవతా
స్వర్ణమూర్తి నా రాణి
మధుర మంజుల వాక్చతుర నా రమణి
శశి నెడబాసిక్రుశించు కుముదమ్మ కరణి
విలపించు ఒంటియై విరహిణీ తరుణి... ॥ప॥

మేఘమా ! ఓ మేఘమా
చెంగుచెంగున రమ్మ
గాలిలో నెగురు బంగారు చెంగావివోలె
తారకలె దీపికగ నుండు తరుణి కన్పడుదాక
జాగు సేయుట తగదు ! మరి రాకపొమ్మ
వెలుగుచున్నవి తారకలు
విరహిణి కన్గవవోలె... ॥మే॥





# 5. మనవి

కాళరాత్రి ఇక కరిగిపోయిందిలే చంద్రిదేవా
శరద్రాత్రి ఇక తిరిగివచ్చిందిలే
వెన్నెలతో నిండింది 1 జగము
పుప్పొడులు రాల్చింది 1 సుమము
పాలవెన్నెల హాయిపు
కలువకన్నెల సొగసు
రావోయి ఓ చంద్రిదేవా
కనవోయి చంద్రిదేవా... ॥కా॥

మబ్బుల్లో వూగింది
మధువుల్లో మునిగింది కలువా
నీరాకకై నేడు జగమంత చూసిందికలువా- ఆ కలువా
తూగింది ప్రిణయవీచి తరంగాలలో





తేలింది కొలిసుధా సురంగాలలో
రావోయి ఓ చంద్రదేవా
వినవోయి చంద్రదేవా
వెల్లివిరిసెను రమ్మా ! జగమంతా స్వామీ
పెల్లుబికెను జవము ఒడలంత స్వామీ
శశిదేవరమ్మా కరుణించిపొమ్మా
శరద్రాత్రి సుమ్మా శరణింక లెమ్మా
అందుకోరమ్మా మా అందాల జేజేలు
పొందుతోపొమ్మా మా వేవేయి జేజేలు...    ॥కో॥







# 6. మేల్కొలుపు

కనలేద నీవు। వినలేద పిలుపు
కౌముదీ మానస। ప్రిణయాంబుధీ ॥వి॥

సప్తస్వర। స్వరాగసుధతో
బాధోజ్వల। మానస వ్యధతో
రాగమాలిక అల్లుచు
రమ్మని పిలుచునదే ॥వి॥

వీచుచున్నది। మలయా నిలము
పిల్చుచున్నది। కోకిల స్వనము
మునుగుచున్నది కోర్కెలందు
కనులముం దదే ॥వి॥





చూచుచున్నది । కలువభామిని

మీటుచున్నది ।హృదయ వీణని

పాడుచున్నది పాటలెన్నొ

మరువబోకుమనీ... ॥వి॥







# 7. చిరతరవాంఛ

అవని నిండిన ఆశ వదలలేనోయీ
మధుర మధుర మీ జీవితమోయీ...
సుందర వనిలో। మధుర ధ్వనిలో
మృణాలాంకుర బాహుద్వయిలో
మరపురాని ముఖకాంతిలో
జగతి జీవితం వదలలేనోయీ
మధుర మధుర మీ జీవితమోయీ... ॥అ॥

పరువము పూచిన। తలపు పండిన
రమణీయోజ్వల రాగ మొదవును
సు విశాల నయన దృగంచలముల
ప్రణయ ప్రపంచం వదల లేనోయీ... ॥అ॥
మధుర మధుర మీ జీవితామోయీ... ॥అ॥





# 8. ఆలాపన

జాలి రాదా । కలువఱేడా
దీనురాలే । కలువబాలా
కోర్కె తీర్చక । కోమలాంగిని
కూడు బెట్టు । ప్రియము లేకను ॥జా॥

వెండివెన్నెల వెలుగులోన
మంచుతుంపర । జల్లులోన
తడసియున్నను జూచినీవు
జాగుసేయక రావదేల... ॥జా॥

మోడుపడిన హృదయ లతిక
పుష్పపుంజము । వాడిపోవునా
బాలచంద్రుని గాంచలేకను
భావిజీవిత మెట్లు దాటుదు... ॥జా॥



ఈ కాలగర్భములోన నేను
కమ్మనైన కలువ రాణిని
చుక్కలన్నియు। నిక్కి మక్కువ
మ్రొక్కుచున్నవి పాదములకు... ॥జా॥





# 9. వ్యధ

ఓ ఓ ఓ రజనికాంతా

కనికరం లేదొకింతా...

కాలుచున్నది। నాదుడెందము

రేగుచున్నది। కన్నులందము

చక్కనైనా చందమామా

ఒక్కమాట చెప్పిపోవా... ॥ఓ॥

దూరమున్నది। నీకు నాకు

కోర్కెయున్నది లేద నీకు

దిక్కులేక। ఈజగానా

పక్కివలె యున్నదానా... ॥ఓ॥





వచ్చియుంటివి ఎన్నిమార్లో
సొక్కిసోలితి । పెక్కుసార్లు
కలువచంద్రిల । మైత్రికన్న
గాఢమైనది । లేదు జగతి... ॥ఓ॥





# 10. మక్కువ

రావోయి నా రాజ
రాగాల జాబిలి
కనవోయి రేరాజ
కౌముదీ రాణిని

ఎదలోని నీకున్న మచ్చ
కనలేదు నే నెన్నడిచ్చ
అదె నీకు సుకీర్తి తెచ్చె
మదినాకు మక్కువ హెచ్చె ॥రా॥

పాలసముద్రము । పట్టెమంచమ్మో
పండువెన్నెల । పగడదీపమ్మో
ఎన్నడెరుగని వూహల తేల
అనురాగాల రసమున్ గోలల ॥రా॥

## 11 వినతి

కమ్మని మాటలతో
తెల్లని నవ్వులతో
ఉలికించబోకోయి చంద్రా
కవ్వించబోకోయి చంద్రా ॥క॥

చల్లనీ వెన్నెలల వెలుగు
కౌముదీ కన్నెలల జిలుగు
చవిచూడ రావోయి చంద్రా
మరుగేల నీకోయి చంద్రా ॥క॥

యెదలోని భావాల తలపు
మేల్కొలిపె నీరాక పిలుపు
కన్నెప్రాయము చూడుమోయి
కరుణించి రావాలోయీ చంద్రా॥ ॥క॥



# 12. హృదయరాగం

రావోయి చెలికాడా
అనురాగమంతా । రాగమాలికలై
రమ్మని పిలుచు కమ్మగాను ॥రా॥

యమునానది తటిని । వెన్నెలకాంతిలో
విరహమేమోగాని । వదలదె నా యెద
భక్తి భావములు పరుగిడుచుండగా
పరవశనై సొక్కి సోలెద రారా...చందా॥

కౌముదీకాంతను । కలువరించాను
వేసారి నీ రాక । ఎదురుచూచాను
మనలేను । ఈ విరహాగ్ని దేవా !
సుధామృతము । కురిపింప రావా ॥రా॥





# 13. మదిలో కోర్కెలు

కథలు కథలుగా

తెరలు తెరలుగా

మదిలో కోర్కెలు పిలిచెనో

ప్రియముగ రమ్మని పిలిచెనో

వసంత సుందరి వాలుచూపుగ

కాంచన లతిక కళలకాంతిగ

మయూర వీణా మధురస్వరమై

సరాళితో నను పిలిచెనో

రయముగ రమ్మని పిలిచెనో





హృదయమంతయు మందారముగ

మదిలో కోర్కెలు మధుర మధువుగ

కాలము నిలువదు నీకై అనుచు

కదలి రమ్మనుచు పిలిచెనో

కళలే కాన్కని తలచెనో...







# 14. నిస్పృహ

శాంతిలేదు సుంతయైన
ఎంతకాలమొ ఈజగాన
ఎంతకాలమొ ఈజగాన...

పూలువున్నవి ముళ్ళపొదలో
కోర్కెలున్నవి। మందుపెదలో
రెంటికీ నడుమున్న భేదము
కష్టసుఖములె కాద ఇలను...      ॥శాం॥

ఆరలేదు ఎదనుచిచ్చు
వాడలేదు వూవురెమ్మను
ఎన్నినాళ్ళకొ భావిసుఖము
ఎంతకాలమొ ఈజగాన...      ॥శాం॥



ఇంతలేదు । నుంతలేదు

భావిసుఖమున కంతులేదు

జవములుండుట తపః ఫలము

జగతి వీడిన నేమిఫలము...                    ॥శాం॥





# 15 కలుషిత

పలుకవేలనో ప్రభూ
కోపమేల దీనురాలిపైన ॥ప॥

పల్లవించును। హృదయగీతులు
మానసాంబుధి వడి వెలువడి
నీ నామమె నానోట
జపియింతు పలుమారులు... ॥ప॥

రాలుకరుగు। మధురధ్వనికి
గుండెకరుగు। అకాలమృతికి
నీ రూపమె నా కన్ను
తిలకించు శ్రమలేకను... ॥ప॥





పతితనగుదు విధిచేతను

విలపింతునే గతియులేకను

నీకొలువె నా జన్మ

కిహపర సాధనములు... ||ప||





# 16. అశక్తత

ఆటలతో। పాటలతో
అభినయించితిగాని
విహార మోదముల
తరింప దీ తనువు... ॥ఆ॥

వలపుతో తలపుతో
తపియించితిగాని
నిరాశ లాశలిల
విశాల నేత్రిముల... ॥ఆ॥

మనసుతో తపసుతో
కృశియించితిగాని
కామ నిష్కామముల
జయింపలేను ఇల... ॥ఆ॥



# 17. ఔన! నిజమేనా!

అందము। కన్నులకే
చందము। భామలకే
రాగము పాటలకే
గానము నాగులకే
ఔనా! ఇది నిజమేనా...

డెందము కోర్కెలకే
ధ్యానము మౌనులకే
దీవెన బాలలకే
మొక్కులు దేవునికే
ఔనా! ఇది నిజమేనా...

మాటలు మూటలకే
చేతలు రాతలకే



విరులు తావులకే
మలుపు దారులకే
ఔనా! ఇది నిజమేనా...

గుండెలు మండుటకే
కాపులు పంటలకే
పుట్టుట చచ్చుటకే
త్యాగము శీలముకే
ఔనా! ఇది నిజమేనా...

కోటలు రాజులకే
తోటలు పూవులకే
ప్రాణము జీవులకే
మెరుపు తారలకే
ఔనా! ఇది నిజమేనా...



# 18. ప్రకృతి

అందమైన ఎఱ్ఱరంగు

అరుణోదయము

తెల్లనైన వెండిరంగు

చంద్రోదయము

చల్లనైన పిల్లగాలి

పవనోదయము

మనసు మరులుగొన్న యౌవనోదయము ॥అంద॥

వలపుతగిలిన యెద రాగోదయము

కోర్కెలు ఎదవీడిన

జ్ఞానోదయము





మహిని స్వాతంత్ర్యంబొచ్చిన
మహోదయము

త్యాగము చేసిన వీర
స్వర్గోదయము ॥౨౦॥





# 19. మూ గ భా వా లు

నా యెదలోని భావాలు
మధురమై । సరళమై
వినువీధి కెగసినవి
విహంగతతులై ... ॥నా॥

కనులెదుట నీలాల
కాంతులై ప్రసరించి
దివినుంచి జారినవి
అతిభారమై భువికి... ॥నా॥

అతిలోక సౌందర్యమై
యెదనుండు మందారమై
మధురమౌ తేనెలను
విరజిమ్మ సోనలను... ॥నా॥



## 20. ఎదుట

కన్నులలో । కదిలే మెదిలే

కలువలరాజా । కదలిరావోయీ

కన్నె కలువకన్న । మిన్న ఏమున్నది

చలువ వెన్నెలకన్న । వేరేమున్నది

మమతలు ఏవో మదిలో రేగెను

తలపులు ఏవో బరువై తోచెను ॥క॥

కాలము దీపకళిక మాదిరిగా

కరుగుచున్నది కలలో కోర్కెగా ॥క॥







## 21 అందచందము

సొగసుల వయ్యారాల మిఠారి నేనోయి
ఓ కలువల రేడా। కాసింత కనవోయి

చల్లని వెన్నెల కాంతులు నీవోయి
ఝుల్లనె చూపుల తూపులు నావోయి ॥సొ॥

పున్నమి వెన్నెల నిండెను జగమోయి
కన్నెల కోర్కెలు పండును నిజమోయి ॥సొ॥

పాలసంద్రపు తెలుపు జవరాలి వలపోయి
బాలచంద్రుని వలపు ఈమృణాలి మనసోయి ॥సొ॥







# 22. క ల

చూడచక్కని సూర్యోదయము
రేకులు విచ్చెను నీరజము
కలయేమో గాంచితిని
నిజమని నే నమ్మితిని...

వినబడెనెదో మంజీర నినాదం
కనబడెనెదో కమ్మని రూపం
పెల్లుగ కురిసెన్ హేమంత తుషారం
వడివడి జలజల పడియెన్ నాపై
కలయేమో గాంచితిని
నిజమని నే నమ్మితిని...





కోమల హస్తము। కోరెను పద్మము
పద్మము తెచ్చెద। పల్కుము మెల్లగ
అనుచుండగనె। పోయెను యువ్వని
కలయేమో గాంచితిని
నిజమని నే నమ్మితిని...

మంటప ప్రాంగణ మొదటి మెట్టుపై
యువ్వని ఏదో వెదకుచుండెను
ఏమని ప్రశ్నించగనె?
సిగ్గున తలవంచెనదే
కలయేమో గాంచితిని
నిజమని నే నమ్మితిని...

ఆశ నిరాశలా విశాల నయనమ్ముల
బాధాజనకమై చూపెడునే





ఇటునటు అంతట వెదుకగా
కనుపించెన్ మంజీర మామెది

అన్నుల మిన్న । ఇదిగోకొనుమని
అందిచ్చితినే । ఆనందముతో...

చూచెను చెలువ విశాల నయనమ్ముల
చిరునవ్వు లొలికెన్ । చిరుతామరలై
భాష్పాంబువు లొప్పెన్ కన్నులనాగక
జలజల రాల్చెను । కరుణాముఖియై...

కలయేమో గాంచితిని
నిజమని నే నమ్మితిని...



